నూనె విడివిగ నుత్పత్తి యగు చోట్ల కొంత వఱకు దీపములకు గూడ నుపయోగింప బడుచునే యున్నది. దీనితో సబ్బుబిళ్లలు తయారుచేయుటయు గలదు.

పొడి ఆవపిండికి గూడ ఘాటగు వాసన గాని, కారము గాని యుండదు. కాని యిందలి సినిగ్రిన్ (Sinigrin), మైరోసిన్ (Mirosin) అను రెండు ద్రవ్యములు నీటితో కలిసి నపుడొక విధమగు అస్థిర తైలము జనించును. ఇదియే ఘాటునకును, కారమునకును గారణము. ఈ చమురుపరిమాణము గింజల జాతిని, రకమును బట్టి నూటికి సుమారు 0,239 మొదలు 1.059 వంతుల వర కుండునని లెక్కవేయబడెను. ఇది సన్న ఆవాలలో హెచ్చుగను, గంగ ఆవాలలో తక్కువగను,తక్కిన వానిలో మధ్యమముగను నుండును.

చమురు దీసివేసిన ఆవపిండి సంఘట్టనము I–A,B యనుబంధములందు తెలుపబడెను. సన్న ఆవ పిండిలో ఘాటు ద్రవ్యము హెచ్చుగ నుండుటచే పశువులకు పనికిరాదు. తక్కిన జాతుల ఆవ పిండిలో నిది తక్కువగ నుండుటచే పశ్వాహారముగ నుపయోగింపబడు చున్నది.

ఆవ పిండిని తడిపి నపుడందు పైని వ్రాయబడినట్లు ఘాటగు అస్థిర తైలము జనించుట చేతనే యీ పిండి చర్మమున కందజేయుటకును, పొక్కించుటకును, మానవ వైద్యము నందును, పశువైద్యము నందును ఉపయోగింపబడు చున్నది. ఆహారపదార్థము లందు ఆవ గింజలను గాని, వాని పిండిని గాని చేర్చినపుడు వానిని

జీర్ణము చేయుటకు కూడ నీ యష్టిర తైలము కొంత వరకు తోడ్పడును. ఈ విషయమై ఓషధులను గూర్చిన గ్రంథమున విపులముగ వ్రాయబడును.

చమురు తీసిన ఆవ పిండి యెరువుగకూడ విరివిగ వాడబడుచున్నది. ఇందు దినుసును బట్టి సుమారు $3\frac{1}{2}$-$5\frac{1}{2}$ వంతుల వరకు నత్రజనియు, $1\frac{1}{2}$-$3\frac{1}{2}$ వంతుల వరకు స్ఫురత్వంచామ్లజనిదమును, $1\frac{2}{3}$ వంతుల వరకు పొటాషును ఉండునని లెక్క వేయబడెను. I–D యనుబంధము చూడుడు.

# అవిసె.

Linseed–Linum usitatissimum, N. O. Lineaceae.

అరవము_అలివెరై; కన్నడము_అలసి; హిందీ_మసినే;
సంస్కృతము_అతసీ, ఉమా, క్షుమా.

అవిసె యను పేరు అగతి లేక అగస్త్య వృక్షము నకు కూడ వాడుకలో నున్నది. కావున చమురు గింజల నొసగు నీ మొక్కను వేరుగ గుర్తించుటకు దీనిని సీమఅవిసె యనుట కూడ గలదు. అతసీ యను సంస్కృతశబ్దము కూడ రెంటికిని ఉపయోగింపబడు చున్నది.

## చరిత్ర, వ్యాపకము.

అవిసె మొక్కకు పర్సియా దేశమును, నల్లసముద్రపు(Black sea) ప్రాంతములను ఆదిమ స్థానములుగ పరిగణింపబడు చున్నవి. అచట నిది వన్యస్థితి యందు గాననగును. ఇది యిండియా దేశమునకు సూత్రకాలము నాటికే వచ్చియుండును. పాణిని యష్టాధ్యాయిని యందిది పేర్కొన బడెను. కౌటిల్యుని యర్థశాస్త్రము నందు గూడ దీని ప్రశంసగలదు.

సీమఅవిసె సాగు విరివిగ గల దేశములలో దక్షిణ అమెరికాలోని అర్జంటినా యగ్రస్థానము వహించుచున్నది. రెండవది రషియా, మూడవది ఇండియా. నాల్గవది అమెరికాసంయుక్త రాష్ట్రములు. ప్రపంచమం

దంతటను మొత్తమువీూద నీ సస్యము ఏటేట సుమారు 16½ లక్షల యెకరముల పై సాగు చేయబడు చున్నది. వివరము లీ క్రింద తెలుపబడెను.

| | 1935 వ సంవత్సరమున | |
|---|---|---|
| | విస్తీర్ణము—ఎకరములు (వేలు) | గింజల పంట-టన్నులు (వేలు) |
| అర్జంటినా | 50,88 | 14,03 |
| రషియా*(1926-30 సగటు) | 45,28 | 7,01 |
| ఇండియా | 34,57 | 3,88 |
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | 20,96 | 3,63 |
| కనడా | 3,07 | 42 |
| పోలండు | 3,04 | 70 |
| ఉరుగ్వే | 3,11 | 75 |
| ఇతరములు | 3,21 | 57 |
| మొత్తము | 1,64,12 | 30,99 |

రషియాలో నిది విస్తారముగ నారకొరకే పండింపబడు చున్నది. అర్జంటినా యందును, ఇండియాలోను చాల వరకు చమురు గింజల కొరకే పండింపబడు చున్నది.

---

* రషియాలోని విస్తీర్ణమును, పంటయు, 9 వ పుట యందలి యంకెలలో జేర లేదు.

ప్రపంచ మందలి మొత్తపు అవిసె గింజల పంట ఏషియాలోని పంట కూడ చేరి సుమారు 31 లక్షల టన్నులుండునని యంచనా వేయబడెను. గింజలను విస్తారముగ నెగుమతి చేయు దేశములలో అర్జంటినా ప్రథమము. ఇండియా రెండవది. కలకత్తా, బొంబాయి రేవు లీ యెగుమతి విస్తారముగ జరుగు రేవులు.

ఇండియాలో నీ సస్యము పైరుచేయు రాష్ట్రములలో మధ్యరాష్ట్రములును, సంయుక్తరాష్ట్రములును, బీహారును ప్రధానములు. సంస్థానములలో నిజాం రాష్ట్రమున నిది విరివిగ పైరు చేయబడు చున్నది. ఆయా రాష్ట్రము లందలి విస్తీర్ణ మీ క్రింద వివరింపబడును. [3]

| | 1940-41 వ సంవత్సరమున | |
|---|---|---|
| | విస్తీర్ణము—ఎకరములు (వేలు) | పంట-టన్నులు (వేలు) |
| మధ్యరాష్ట్రములు, బీహారు | 12,18 | 97 |
| సంయుక్తరాష్ట్రములు | | |
| ప్రత్యేకముగ | 2,56 | 49 |
| ,, మిశ్రణముగ | 5,85 | 1,12 |
| బీహారు | 5,34 | 71 |
| నిజాంరాష్ట్రములు | 4,54 | 43 |
| ఇతరభాగములు | 5,59 | 60 |
| మొత్తము | 36,06 | 4,32 |

చెన్న రాష్ట్రములో నీ పంట చాల తక్కువ. తెలుగు జిల్లాలో నిది రాయలసీమ యందు — ముఖ్యముగ కర్నూలు జిల్లాలో—స్వల్పముగ పెరగుచున్నది. విస్తీర్ణము సుమారు 2 వేల యెకరములకు మించదు. 30 సంవత్సరముల క్రిందట నీ రాజధాని మొత్తము మీద నిది 25,000 వేల యెకరములపై సాగునం దుండెడిది. కాని యిటీవల తగ్గిపోయెను.

## మొక్క—యొక్క సామాన్యలక్షణములు, రకములు.

అవిసె మొక్క యీ దేశమున సుమారు $1\frac{1}{2}$-$2\frac{1}{2}$ అడుగుల యెత్తు గుగును. రషియాలోను, మరికొన్ని దేశములలోను 5-6 అడుగుల వరకు యెదుగుట గలదు.

అవిసెవేరు నూవు, ఆవ మొక్కలందువలె గాక మొక్క యెత్తునుబట్టి చూచిన హెచ్చు లోతునకు-ముఖ్యముగ కృష్ణరేవడి నేలలలో—బోవును. కొంత క్రిందికి పోయిన పిమ్మట పిల్ల వేళ్లు విస్తారముగ బయలుదేరును. తేమ పై పైననే లభించు వండలి నేలలలో వేరంత లోతునకు బోదు. పిల్ల వేళ్లు కూడ పై భాగమందె విస్తారముగ బయలుదేరును.

ప్రకాండమున క్రింది నుండియు శాఖలు బయలుదేరుటచే మొక్క దుబ్బు వలె నిడివిగ నెదుగును. 19వ పటము చూడుడు. కొన్ని శాఖలందు పైని యుపశాఖలుబయలుదేరుటయు గలదు. ఆకులు చిన్నవిగను,సన్నముగను నుండును. సుమారు1_2అంగుళములుపొడవును, $\frac{1}{12}$–$\frac{1}{8}$అంగుళముల వెడల్పును ఉండును. 20 వ పటము చూడుడు.

20 వ పటము($\frac{1}{8}$ ఆకృతి)



అవిసెమొక్క--కొమ్మలుపెట్టు తీరు

21 వ పటము($\frac{1}{2}$ ఆకృతి)



అవిసెమొక్క--పై భాగము

22 వ పటము( రెట్టింపు)



అవిసెపూవు

23 వ పటము (పూర్ణాకృతి)



అవిసెకాయ

24 వ పటము(4 రెట్లు)



అవిసెగింజలు

పూవులు చిన్నవి. ఆకుపంగలలో నిడివియైన కాడలచివర నుండును. రక్షక పత్రము లైదును కొంత వర కేకముగ నుండి పైని తమ్మెలుగ జీలి యుండును. ఆకర్షక పత్రము లైదు. ఆయా రకములలో నివి తెలుపు,నీలవర్ణము లేక ఊదారంగు గలిగియుండును. కింజల్కములు నాలుగు. అండాశయ మొక్కటే. 22వ పటము చూడుడు. పూవులు సామాన్యముగ ప్రాతఃకాలమున విడిచి మగిల సాయంకాలములోపల ముడుచుకొనును. చాల పూవులు మరునాడు మరియొకసారి కూడ విడచి మూసికొనును. పూవులు గర్భవతు లగుటకు తేనె టీగలు తోడ్పడును. ఆత్మ సంపర్కమే సామాన్యము. కాని కొన్ని పూవులు స్వాభావికముగ పర సంపర్కము వలన గర్భవతు లగుట గూడ గలదు.[41]

అవిసె కాయలు 5 అరలు గలిగి గుండ్రముగ నుండును. ఒక్కొక్క యరలో రెండేసి గింజ లుండును. గింజలు చిన్నవి. 23, 24 వ పటములు చూడుడు. రకమునుబట్టి తులమునకు సుమారు 1800_2200 వరకు తూగును. సామాన్యపు రకములు మసరనూవు గింజలను బోలిన రంగు గలిగి యుండును. పసిమి లేక జింక (Fawn) వర్ణము గల గింజల రకములును గలవు. గింజలలో చమురు నూటికి 35_45 వంతుల వర కుండును. పెద్ద గింజల రకములలో హెచ్చుగను, చిన్న గింజల రకములలో తక్కువగను నుండును. ఆంధ్రదేశమున సాగునందున్న సామాన్యపు రకములు పెద్దవిగనుండు మసర గింజల రకములు.

## సేద్యవిధానము.

అవిసె ప్రత్యేకముగను, ఇతర సస్యములతో మిశ్రమముగను గూడ పైరు చేయబడు చున్నది. దీనితో కలిపి సాగు చేయదగు సస్యములు

సెనగ, గోధుమ, ఆవ. సంయుక్తరాష్ట్రము లందు హెచ్చు విస్తీర్ణమున మిశ్రిణముగనే సాగు చేయబడు చున్నది.

ప్రత్యేకముగ సాగు చేసినపుడు అవిసెను కృష్ణరేవడి నేలలలో పైరగు గోధుమ, ప్రత్తి, కొఱ్ఱ, నీలి, సెనగ మొదలగు వానితో పరివర్తనము చేయవచ్చును.

నేల యందు పదును నిలచుట యీ సస్యము బాగుగ పైరగుటకు కావలసిన ముఖ్యాంశములలో నొకటియగుటచే నిందుకుగాను నేలను బాగుగ తయారు చేయవలెను. తొలకరిలో నితర సస్యములను పెట్టకయే వర్షము గురియ నారంభించి నప్పటి నుండియు శీతకాలము వరకు నేల నప్పుడప్పుడు దున్నుచుండుట మంచిది. లేక తొలకరిలో రెండు సార్లు నేలను దున్ని పిమ్మట నపుడపుడు నేలపై గుంటక తోలుచు రావచ్చును.

కడపటి వర్షపుపదును ఆరిపోకమునుపు విత్తులను వెదజల్లవచ్చును. లేక గొఱ్ఱుతో వరుసలుగ వేయవచ్చును. గొఱ్ఱుతో వరుసలుగ జల్లునపుడు వరుసల మధ్య సుమారొక యడుగు దూర ముండవలెను. ఎకరమునకు 8 సేర్ల(15 పౌ.)విత్తులను చల్లదగును. పరిస్థితు లనుకూలముగ నుండు ప్రదేశములందు ౪_6 సేర్ల విత్తులనే జల్లుట గలదు.

మిశ్రిణముగ జల్లునెడల నొక వరుస యవిసెయు, నొక వరుస గోధుమయు వేయవచ్చును. లేక యొకవరుస యవిసెయు, నొకవరుస సెనగగాని, యితర అపర దినుసులను గాని విత్తవలెను. ఇట్లు విత్తుచో సగము గింజలే చాలును.

వర్ష కాలాంతమున విత్తబడుటచే నీ సస్యమున కాంతరకృషి యంతగా నవసరము లేదు. వర్షము గురసి నేల గట్టిపడినచో నొక సారి గొర్రు త్రిప్పుట గాని, అంతరకృషి గాని యవసరము కావచ్చును.

ఇదివరలో సూచింపబడిన ట్టి సస్యమునకు ముఖ్యారిష్టము లిది పెరుగు కాలమున మబ్బు వేయుటయు, వర్షము గురియుటయు నయి యున్నవి. అవిసె చేలను పశువులు తినవు. ఏదైన పశువు కొంత హెచ్చుగ దిని నచో వానికి ప్రాణాపాయము కూడ కలుగు నందురు. ఒక జాతి పురుగు కాండమును దొలచుట వలన నందు కంతి బయలుదేరి మొక్క వడలి చచ్చుట గలదు. రెండు జాతుల పచ్చ పురుగులు (జలూకములు) పట్టి యాకులను దినుటయు గలదు. ఒక విధమగు శిలీంధ్రము ఆకులకు పట్టుటచే నందు మచ్చ లేర్పడుటయు నందు వలన మొక్క నీరసించి పూర్తిగ గింజ పోసికొనక కొంత వరకు పొల్లు కాయ లగుటయు సంభవించును.

ఈ సస్యము విత్తిన సుమారు 3½-4 నెలలలో గోతకు వచ్చును. గింజలు ముదురగనే కొడవళ్లతో సస్యమును మొదటికి గోయవలెను. ఆలస్యము చేసిన యెడల గింజలు కొన్ని రాలిపోవును. కొన్ని చోట్ల మొక్కలను వేళ్లతో పీకుదురు. కోసిన లేక పీకిన వెంటనే మొక్కలను పరిశుభ్రమయిన కళ్లమున జేర్చి యెండబెట్టి పిమ్మట కర్రలతో గింజలను రాలగొట్ట వలెను. గాలి కెగురబోసి గింజలను శుభ్రపరచ వలెను.

సామాన్యముగ నెకరమునకు సుమారు 40-60 కుంచముల (300-400 పౌనుల) గింజ లగును. అనుకూల పరిస్థితు లందు సుమారు 800

పౌనుల వరకగుట గలదు. ఇండియాలో సగటున ఎకరమునకు సుమారు 270 పౌనుల పంట పండుచున్నది. సంయుక్తరాష్ట్రము లందు ప్రత్యేకముగ పైరు చేయబడు సస్యము ఎకరమునకు సగటున సుమారు 430 పౌ. గింజల నిచ్చుచున్నది. ప్రపంచమునం దంతటిలోను విస్తారముగ నీ పైరు సాగు చేయబడుచున్న అర్జంటినా దేశమున సగటున నెకరమునకు సుమారు 500 పౌనుల గింజ లగుచున్నవి.

ఒక యెకరము సాగునకగు వ్యయమును, అందువలన వచ్చు నాదాయమును · నీ క్రింద చూపబడెను.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు | | | వ్యయము |
|---|---|---|---|---|---|
| | | ప.జ. | మ. | ఆ.‡ | రు.అ.పై |
| జూలై | దుక్కి—2 సార్లు | 3 | 3 | | 3 0 0 |
| ఆగష్టు– | | | | | |
| అక్టోబరు | గుంటకతోలుట–3 సార్లు | 1½ | 1½ | | 1 8 0 |
| నవంబరు | విత్తులు 8 సేర్లు (15 పౌనులు) | | | | 2 0 0 |
| | గొర్రుతో చల్లిక, గుంటకతో కప్పుట | 1 | 1½ | | 1 2 0 |
| | అంతర కృషి—1 సారి | ½ | ½ | | 0 8 0 |
| | కోత, కైలు | | 4 | 8 | 2 0 0 |
| | పన్నులు | | | | 2 0 0 |
| | మొత్తము | 6 | 10½ | 8 | 12 2 0 |

‡ ప.జ. = పశువులజతలు; మ. = మగవాండ్రు; ఆ. = ఆడువాండ్రు.

| రాబడి | రు. అ. పై |
|---|---|
| 50 కుంచముల అవిసెలు* కు 1 కి 10 సేర్ల చొ॥ | 20 0 0 |
| కంప-1 బండి | 1 0 0 |
| మొత్తము | 21 0 0 |
| నికరాదాయము | 8 14 0 |

## ఉపయోగము.

పూర్వకాలమున రోమనులును, గ్రీకులును నీ గింజలనే యాహారముగ నుపయోగించు చుండిరట. ఇప్పటికిని అబిసీనియాలో నీ గింజ లిట్లుపయోగింపబడు చున్నవి. అవిసె గింజల సంఘట్టనము I-A, B అనుబంధములలో దెలుపబడెను. అవిసె గింజలను పిండిచేసి యుడికించి ఆవ నూనెతో గలిపి కురుపులు మొదలగు వానికి కట్లను గట్టుట కుపయోగింతురు. ఇందుకు చమురు తీసిన పిండి శ్రేష్ఠముగ నెంచబడు చున్నది.

గింజలలో చమురు నూటికి 35-45 వంతు లుండును. అవిసె గింజల నుండి వేడిమి తగులకుండ పరిశుభ్రముగ తీసిన చమురు పసిమి రంగు కలిగి తేటగా నుండును. వాసన గాని రుచి గాని యంతగా నుండదు. ఇట్టి చమురు రష్యా మొదలగు కొన్ని దేశములందు నూవుల నూనె వలె కొద్ది

* అవిసెగింజలు కుం॥ 1కి సుమారు 7½ పౌనులు తూగును.

గొప్ప యాహారముగ నుపయోగింపబడు చున్నది. వైద్యమునకు గూడ నిట్టి చమురే శ్రేష్ఠము. పశు వైద్యమున నీ చమురు ఆముదము వలె విరేచనౌషధమున కుపయోగింపబడు చున్నది.

అవిసెనూనె విలువయైన శోషక తైలము. అందలి ప్రధాన ద్రవ్యమగు లినోలిన్ వలననే దానికి శోషకత్వము కలుగుచున్నది. పలుచని పొరగాపరచి కొంత కాలము గాలి తగులనిచ్చుచో నీ చమురు ప్రాణవాయువును పీల్చికొని రబ్బరువలె యథాస్థితిగమ్యత్వ (Elastic) గుణముగల వస్తు వేర్పడును. ముందుగా మాంగనగంధకితము, సీసపికామ్లజనిదము మొదలగు కొన్ని రాసాయనిక ద్రవ్యములను స్వల్పముగ జేర్చి యుడికించినచో నీ మార్పు మరింత త్వరలో గలుగును.* ఇట్టి స్వభావము గలదగుటచే యీ చమురు రంగులు, వార్నిషులు మొదలగునవి తయారు చేయుటకు చాల యుపయోగకారిగ నున్నది. తేమ యంటని (Water-proof) గుడ్డలను తయారు చేయుటకు, అచ్చునకు బనికివచ్చు సిరాలను తయారు చేయుట మొదలగు మరికొన్ని పనులకు గూడ నుపయోగపడు చున్నది.

చమురు దీసిన యవిసె పిండి పశువులకు మంచి యాహారము. దీని సంఘటనము I–C యనుబంధమున దెలుపబడెను. ఇందు నూవు తెలికపిండిలో కంటె మాంసకృత్తులు తక్కువ. సారపదార్థము హెచ్చు.

అవిసెనూనెను వంటాముదము వలె నుడుకబెట్టిగాని, దేశవాళీ గానుగలలో గాని 2 వ యనుబంధమున వివరింపబడిన ఇతర యంత్రముల సహాయమున గాని దీయవచ్చును. సామాన్యముగ పరిశ్రమలం దుపయోగింపబడు

---

* ఇట్లు రెండు సార్లు కాచిన చమురు మరింత ప్రశస్తముగ నెంచబడుచున్నది.

అవిసెనూనె మొదట గింజలను విసరి పిండిచేసి హెచ్చు వేడిమి తగులునట్లేర్పాటు గల ఒత్తిడి యంత్రములలో పిండబడును. వేడివలన బీజకవచముపై పొరలో నుండు జిగురు పదార్థము నశించిన గాని చమురు సులభముగ వీడిరాదు. కాని యిట్లు వేడిమి సహాయమున దీసిన చమురు అనిష్టమగు వాసనయు, రుచియు గలిగి యుండును.

దేశవాళీ గానుగతో నూటికి సుమారు 25_30 వంతుల చమురు దిగుబడి యగును. ఒకానొక తణిఖీలో చిన్న మసరగింజలు నూటికి సుమారు 29 వంతులును, పెద్ద మసరగింజలు 31 వంతులును, తెల్లగింజలు 35 వంతులును యిచ్చెను.[4]

# వలిసె*.

Niger–Guizotia Abyssinica, N. O. Compositae.

అరవము-పేయెల్లు; కన్నడము_హుచ్చెళ్లు; గుజరాతీ_రాజ్ తిల్;
హిందీ_సార్గూజా.

## చరిత్ర, వ్యాపకము.

వలిసెకు ఆఫ్రికా ఖండము నందలి యుష్ణభాగ మాదిమస్థానమని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఆ ఖండపు తూర్పుతీరమున సముద్రమున గలియు నైజర్ నది నుండియే దీని యింగ్లీషుపేరు గలిగి యుండవచ్చును. శాస్త్రీయ నామపు రెండవ భాగ మీ జాతి మొక్క అబిసీనియా దేశమునకు సంబంధించినదని తెలుపుచున్నది.

ఈ సస్య మిండియా కెపుడు వచ్చెనో దెలియుట లేదు. కాని చాల చోట్ల కొద్ది గొప్ప సాగు చేయబడు చున్నది. జన్మభూమి యగు ఆఫ్రికాలోనే గాక ఐరోపా ఖండమున జర్మనీ మొదలగు కొన్ని దేశము లందు కూడ నిది స్వల్పముగ సాగునం దున్నది.

---

* వలిసెకు వెర్రినూవులని కూడ పేరు గలదు.

ఇండియాలో వలిసె సాగుచేయబడు రాష్ట్రములలో బొంబాయియు, చెన్నపురియు ముఖ్యములు. సంస్థానములలో మైసూరు పేర్కొనదగినది.

చెన్నపురి రాజధానిలో విశాఖపట్నం, కడప, బళ్ళారి జిల్లాలు తెలుగునాడు నందలి వలిసె సాగు గల ముఖ్యజిల్లాలు. ఉత్కళపు సరిహద్దున నీ సస్యము కొంత విరివిగ సాగు చేయబడు చున్నది. అరవ నాడున జేరిన దక్షిణార్కాడు, సేలం, కోయంబత్తూరు జిల్లాలలో గూడ నీ సాగు స్వల్పముగ గలదు.

## వలిసె మొక్క సామాన్య లక్షణములు.

వలిసె బంతి కుటుంబమున జేరిన యొక ఏకావార్షికజాతి మొక్క. సామాన్యముగ 2 అడుగుల యెత్తెదుగును.

తల్లి వేరు మొక్క యెత్తును బట్టి చూచిన నూవులో వలెనే కురుచగ నుండునని చెప్పవచ్చును. మొక్క పై యెత్తులో వేరు సామాన్యముగ $\frac{1}{5}$–$\frac{1}{3}$ అడుగు కంటె పొడ వుండదు. అనగా సుమారు 5_8 అంగుళముల లోతు వరకు మాత్రమే బోవును. ప్రక్క వేళ్లును ఇంత కంటె దూరమునకు వ్యాపింపవు. వర్ష కాలపు పైరు వేళ్ల కంటె ఎండకాలపు పైరు వేళ్లు కొంచెము లోతునకు బోవును.

కాండము కొంచె మూదా వర్ణముతో గూడిన యెరుపు రంగు గలిగి గుండ్రముగ గాని, యించుక బల్లపరుపుగ గాని యుండును. క్రింది భాగమున నంతగా గొమ్మలుండవు. సామాన్యముగ నవి నాల్గవ లేక ఐదవ కణుపు నుండి పుట్ట నారంభించును.

వలిసెయాకులు నూవు మొక్క యందు వలెనే యొక్కొక్క కణుపున రెండేసి యుండి క్రింది జతకు పై జత యడ్డుగా బయలుదేరును. ఆకులు కణుపునకు రెండేసి యుండుటచే కొమ్మలును రెండేసి యుండును. నూవు

25 వ పటము.



వలిసె మొక్క, పై భాగము- పూవులతో (పూర్ణాకృతి)

మొక్కలో వలెనే క్రింది యాకులు పెద్దవిగ నుండి పైకి పోయిన కొలదిని యవి చిన్నవగును. ఆకు నందు తొడిమ ప్రత్యేకముగ నేర్పడియుండదు. క్రింది యాకులు సామాన్యముగ 4_6 అంగుళముల పొడవును, నడుమ 1.2½ అంగుళము వెడల్పును ఉండును. అంచులు దంత గరి గలిగి యుండును.

వలిసె పూవు లనేకము చేరి చిన్న రేకబంతి పూవు లంతేసి గుచ్ఛము లంగ నేర్పడి యుండును. సామాన్యపు పూవు లందలి పుష్పకోశమువలె

26 వ పటము.



వలిసెపూవు (గుచ్ఛము) పూర్ణాకృతి

గన్పడునది చేటికావలయము. పూవులన్నియు దానిపై మధ్యగా నమరి యుండును. పుష్పకోశము రోమములవలె పరిణామము నొంది యుండును. దళవలయము సంయుక్తము. మధ్య పూవులలో నిది గొట్టమువలె నేర్పడి యుండును. చుట్టును నుండు వానిలో నీ గొట్టపుకొనను నాలుక వంటి పచ్చని రే కొకటి యేర్పడి యుండును. ఈ రేకులే పూవు నాకర్షవంతముగ జేయునవి. కింజల్కము లైదు. అండాశయ మొక్కటే. ఎండిన వెనుక పుష్పగుచ్ఛమును విడదీసినచో నందలి యొక్కొక దళవలయపు గొట్టమునకు దిగువ నల్లని ఫలకవచముచే నావరింపబడిన చిన్న గింజ యొకటి గానవగును. గింజయని వ్యవహరింపబడు చున్నను నిది నిజముగ ఫలమే. ఇది నూవు

27 వ పటము.



వలిసె గింజలు (4 రెట్లు)

గింజ కంటె సన్నముగ నుండును. కాని యింతుక పొడవు. వరిసె గింజలు తులమునకు సుమారు 2500 వరకు తూగును.

## సాగునకు దగిన పరిస్థితులు.

వరిసె యుష్ణమండలివాసి యైనను యెండకును, శీతలమునకును గూడ నోర్చును. మిగుల కొద్ది వర్షముతోనే పెరుగ గలదు. కొంత హెచ్చుగ గురిసినను నంతగా చెడదు. కావున నీ సస్యము తొలకరిలోను పయరను, మధ్యకాలమునను గూడ విత్తి సాగు చేయబడు చున్నది. విశాఖ పట్నం జిల్లాలో కొండ ప్రదేశములం దిది తొలకరి నూవు వలె మే-జూన్ నెలలలోగాని, మాఘినూవువలె సెప్టెంబరు-అక్టోబరు నెలలలోగాని విత్తబడు చున్నది. సమ ప్రదేశములం దిది పయరసస్యముగ అనగా డిసెంబరు_జనవరి నెలలలో గూడ విత్తబడు చున్నది. కడప, బళ్ళారి జిల్లాలలో జూలై నెలలో నొక సారియు, జనవరి నెలలో నొక సారియు విత్తబడు చున్నది. మైసూరునం దిది సామాన్యముగ ఆగష్టు నెలలో జల్లబడును. బొంబాయి రాజధానిలో దీనిని జూన్-జూలై నెలలలో విత్తుదురు. తొలకరి సస్యము సుమారు 4_4½ నెలలలోను, మధ్యకాలపు సస్యము సుమారు 3½-4 నెలలలోను, పయరసస్యము సుమారు 3-3½ నెలలలోను ఫలించును.

వరిసెకు తేలికగ నుండు యెఱ్ఱ నేలలు ప్రశస్తము. ఇసుకకొండి నేల లందు సైతము సులభముగ పైరగును. ఇతర సస్యము లంతగా బెరుగని కొండ నేలలందు గూడ దీనిని సాగు చేయు చున్నారు. బొంబాయి

రాజధాని యందును, రాయలసీమ యందును నిది నల్ల నేలలలో గూడ పైరు చేయబడు చున్నది. తొలకరి పంటకును మధ్యకాలపు పంటకును తేలిక నేలలును, పయరు పంటకు నల్ల నేలలును అనుకూలముగ నుండును.

## సేద్యవిధానము.

వలిసెను తొలకరిలో విత్తు నెడల దీనిని గోసిన వెనుక కాయధాన్యములు పైరు చేయదగును. మధ్యకాలపు పైరును, పయర పంటను తొలకరిలో సాగు చేయబడు తృణధాన్యముల కోతకు బిమ్మట సాగు చేయనగును.

వలిసెను ప్రత్యేకముగను, ఇతర తృణధాన్యములతో కలిపియు గూడ సాగు చేయవచ్చును. పశువు లంతగా దినకపోవుటచే ఈ చేనినితర సస్యముల చుట్టును కొంత వెడల్పున విత్తుటయు గలదు.

తొలకరి సస్యమునకు హెచ్చుగ దున్న నవసరము లేదు. 1.2 సార్లు దున్నిన పిమ్మట గింజలను జల్లి కలియదున్ని కంపతోడుగు తోలిన చాలును. నూవు గింజల వలె నివియు మిగుల చిన్నవగుటచే విత్తుటకు ముందు గూడ చాళ్లు కప్పుటకు నేలపై నొకసారి కంపతోడుగు తోలుట మంచిది. గొర్రుతో వరుసలుగ వేయుచో నేలను మొదట 2 సార్లు దున్ని 2 సార్లు గుంటక దోలి విత్తినపిమ్మట మరియొకసారి గుంటక తోలి కప్పవచ్చును. వరుసల మధ్య దూరము సుమారొక యడుగుండ వలెను. మధ్యకాలపు పంటకు వెనుకటి పంట కోతకాలు బాగుగ

నూడివచ్చి మంటిచే కప్పబడునట్లు మరి యొకటి రెండు సార్లు హెచ్చుగ దున్నుట యవసరము. పయిర పంటకు నేల నెంత బాగుగ దున్నిన నంత మంచిది.

ఈ సస్యమున కెరువు వేయు టరుదు. కొందరరుదుగ పశువుల యెరువును గాని, పెంటను గాని సుమారు 5-6 బండ్లు తోలుట గలదు.

వలిసెను ప్రత్యేకముగ జల్లునెడల నెకరమునకు సుమారు 3-4 సేర్ల (5-7 పౌనుల) విత్తులు చాలును. ఇతర సస్యములతో కలిపి చల్లు నెడల సుమారు 1-1½ సేరు విత్తులు చాలును.

ఈ సస్యమున కాంతరకృషి చేయు టరుదు. కాని తొలకరిలో వెదజల్లిన చేని కొక సారి గొప్ప దంతెవ్వుట లేక కలుపు తీయుటయు వరుసలుగ జల్లిన పైరు మధ్య 1-2 సార్లు పాపటము తోలుటయు మంచిది.

ఒత్తుగ మొలచిన యెడల చేనిపై పండ్లమ్రాను తోలి గాని, కొన్ని మొక్కలను పీకివేసి గాని పలుచన చేయవలెను. మొక్కలు క్రిక్కిరిసి యుండుచో తగినన్ని కొమ్మలను పెట్టి కాపు బాగుగ గాయవు.

వలిసె చేల కరిష్టములు తక్కువ. పశువు లంతగా దినవు. ఒక జాతి గొంగళి పురుగులు మాత్రము అప్పు డప్పుడు చేలను హెచ్చుగ పట్టి యాకులను దినుట గలదు.

వలిసె చేలు పండిగనే మొక్కలను కొడవళ్లతో గోసి, పనను 3-4 దినము లెండనిచ్చి కళ్లముతోనికి తీసికొనిపోయి కర్రలతో గొట్టి నూర్చి

గాలి కెగురబోయవలెను. హెచ్చుగ నున్న చోట్ల పశువులచే త్రొక్కింప వలెను.

ప్రత్యేకముగ జల్లునెడల ఎకరమునకు సామాన్యముగ 40_60 కుంచముల (280_420 పౌనుల) గింజ లగును.

తొలకరి సాగునకగు వ్యయమును, అందువలన వచ్చు నాదాయమును ఈ క్రింద యంచనా వేయబడెను.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు ప.జ. | మ. | ఆ.‡ | వ్యయము రు.అ.పై |
|---|---|---|---|---|---|
| మే | దుక్కి—1 సారి | 1½ | 1½ | | 1 8 0 |
| జూన్ | విత్తులు-3 సేర్లు | | | | 0 6 0 |
| | విత్తులు చల్లి కలియదున్ని కలప తోడుగు తోలుట | 3 | 3 | | 3 0 0 |
| | గొప్పుత్రవ్వుట, కలుపుతీత | | 1 | 12 | 1 12 0 |
| అక్టోబరు | కోత, కైలు | | 4 | 8 | 2 0 0 |
| | పన్నులు (½ భాగము) | | | | 1 0 0 |
| | మొత్తము | 4½ | 9½ | 20 | 9 10 0 |

| | | |
|---|---|---|
| రాబడి | 50 కుంచములు (350 పౌనులు) రు 1 కి 3½ కుంచముల (25 పౌనుల) చొప్పున | 14 0 0 |
| | కంప 700 పౌనులు | 1 0 0 |
| | మొత్తము | 15 0 0 |
| | నికరాదాయము | 5 6 0 |

‡ ప.జ. = పశువులజతలు; మ. = మగవాండ్రు; ఆ. = ఆడువాండ్రు.

## ఉపయోగము.

వలిసెల నుండి నూవుల వలెనే చమురును దీసి యుపయోగింతురు. పరిశుభ్రముగ దీసిన చమురు లేబసిమి రంగు గలిగి తేటుగను, స్వచ్ఛము గను నుండును. ఇంచుక కమ్మని వాసన గలిగి యింపుగ నుండును. ఈ పంట గల చోట్ల నిది నూవుల నూనె వలె వంటకము లందు తాలింపు వగైరాలకును, నేతి వలె చేతిమీద వేసికొని యన్నముతోను, నితర పదార్ధ ములతోను కలిపి తినుటకును నుపయోగింపబడు చున్నది. కొందరు నూవుల నూనె కంటె దీనినే ప్రశస్తముగ నెంచుచున్నారు. వలిసె చమురు దీప ములకు గూడ నుపయోగింపబడు చున్నది. ఈ చమురు శోషక స్వభా వము గల స్థిర తైలమయినను, శోషక లక్షణము తక్కువగుటచే యవిసె నూనె వలె రంగులు తయారు చేయుట కిందలగు బనులకు పనికిరాదు. ఇది పాశ్చాత్య దేశముల కెగుమతియై యచట సబ్బులను తయారు చేయు టకును, కొంత వరకు యంత్రముల యిరుసులకు బెట్టుటకును నుపయోగింప బడుచున్నది.

ఈ దేశమున బండిన వలిసెలలో నూటికి సుమారు 40 వంతుల చము రుండును. ఇతర దేశము లందలి గింజలలో నూటికి 45 వంతుల వర కుండుట గలదు.[33] వలిసెల సంఘట్టనము I-A అనుబంధమున చెబుపబడెను.

దేశవాళీ గానుగలతో వలిసెల నుండి తూనిక చొప్పున నూటికి సుమారు 30-35 వంతుల నూనె దిగుబడి యగును. ఈ గింజలను కొన్ని

చోట్ల నూవులతోను, వేరుసెనగ గింజలతోను కలిపి గానుగాడి మిశ్రిత తైలమును దీయుదురు.

వలిసె పిండి పశువులకు మంచి యాహారము. దీని సంఘటనము I-C యనుబంధమున తెలుపబడెను. ఇందు నూవు పిండి యందు కంటె మాంసకృత్తులు యించుక తక్కువగ నుండును. నారపదార్థము హెచ్చు. కావున జీర్ణమగుట కష్టము.

వలిసె పిండి యెరువుగ గూడ నుపయోగించును. ఇందు నత్రిజని నూటికి సుమారు 4.5 వంతులును, స్ఫురత్వంచామ్లజదము 2.4 వంతులును, పొటాషు 1.0 వంతును ఉండునని లెక్క వేయబడెను. 1-D యనుబంధము చూడుడు.

# కుసుంబా.

Safflower–Carthamus tinctorius, N. O. Compositae.

అరవము-కుసుంబా; కన్నడము-కుసుంబా; హిందీ_కుసుమ్.

## చరిత్రి, వ్యాపకము.

కుసుంబా మొక్క-కు ఆఫ్రికాఖండముగాని, యిండియా గాని మాతృభూమియై యుండవచ్చునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము.[5] పంజాబులోని మరికొన్ని ప్రదేశము లందు గిజ -చిన్నదిగ నుండు నొక కుసుంబా జాతి వన్యస్థితిలో గానవచ్చును.[14] బౌద్ధయుగమునాటి దగు కౌటిల్యుని యర్థశాస్త్రమును బట్టి యీ సస్య మాకాలము నుండియు నీ దేశమున సాగు నందు గలదని తెలియుచున్నది. అంతకు పూర్వపు వాఙ్మయమున దీని ప్రశంస గానరాదు.

ఈ సస్య మిపు డిండియాలో చాల భాగము లందును, దక్షిణ యిరోపాలో గొన్ని దేశము లందును, ఈజిప్టు, పర్షియా, చీనా, దక్షిణ రషియా, దక్షిణ అమెరికాలలోను కొద్ది గొప్ప పైరగుచున్నది.

ఇండియాలో నీ సస్యము పైరు చేయబడు ప్రధానరాష్ట్రము బొంబాయి రాజధాని. కొంత వరకు బంగాళారాజధానిలోను, సంయుక్త రాష్ట్రము లందును, మధ్యరాష్ట్రము లందును, చెన్నరాజధానిలోను,

మైసూరు సంస్థానములోను సాగు చేయబడు చున్నది. తెలుగునాడున నీ సస్యము రాయలసీమలో మాత్రము సాగు చేయబడు చున్నది. తమిళ నాడున తిర్నల్వేలి జిల్లాలో నీ పంట కొంత వరకు దీయబడు చున్నది.

## మొక్కల సామాన్యలక్షణములు, రకభేదములు.

కుసుంబా మొక్క గూడ వలిసె వలెనే బంతి కుటుంబములో జేరినది. మొక్క సామాన్యముగ 2-3 అడుగుల యెత్తెదుగును. అనుకూల పరిస్థితులలో కొన్ని రకములు సుమారు 5-6 అడుగుల యెత్తు వర కెదుగుట గలదు.

వేరు వలిసె మొక్కలో కంటె లోతునకు బోవును. మరియు వర్షము తక్కువగ గురియు కృష్ణరేవడి ప్రదేశములలో వర్షము హెచ్చుగ గురియు చోట్ల కంటె లోతుగ బోయును.

ప్రకాండము కొన్ని రకములలో నిడివిగ నెదిగి క్రింది భాగమున అనగా సుమా రొక యడుగు యెత్తు వరకు నంతగా కొమ్మలను బెట్టదు. పై భాగమున బెట్టిన కొమ్మలు గూడ ప్రకాండమును జేరి నిలువుపాటుగ (15-25 అంశములు మాత్రమే వాలి) ఎదుగును. కొన్ని రకములలో ప్రకాండము కురుచగ నెదిగి క్రింది నుండియు (సుమారు 2 అంగుళముల యెత్తు నుండియు) కొమ్మలను బెట్టును. మరియు కొమ్మలు హెచ్చుగ (45 అంశముల వరకు) వాలి యుండును.

ఆకు కొంచె మించుమించు బ్రహ్మదండి యాకును బోలి యంతకంటె కురుచగను, వెడల్పుగను బల్లెపాకారము గలిగియుండును. తొడిమయుండదు. నూవు,వలిసె మొక్కలలో వలెనే క్రిందియాకులు పెద్దవిగనుండి పైకి బోయిన కొలదిని యవి చిన్నవగును. కొన్ని రకములలో నాకుల యంచులు మరి కొన్నిటిలో కంటె హెచ్చుగ చీలి యుండును. అంచులు సామాన్యముగ తరంగ (wavy) ధోరణిగ గాని, లోతైన దంత గరి గలిగిగాని యుండును. పై యాకుల యంచు లందలి గరి కొన్ని రకములలో బిరుసుగనుండి గ్రుచ్చుకొను ముండ్లుగా నేర్పడును. ఈ ముండ్లు కొన్ని రకము లందు స్వల్పముగను, చిన్నవిగను మరి కొన్నిటిలో పొడవుగను, పెద్దవిగను నుండును.

మొదట నెమ్మదిగ నెదిగి యాలస్యముగ ఫలించు రకములలో క్రింది కణుపులు దగ్గరగ నుండుటచే నందలి యాకులు కాండము చుట్టును గుమిగూడి యుండును. త్వరలో ఫలించు రకములలో నాకులు కొంచె మించు మించు సమ దూరముననే బయలుదేరును. ఆయా రకములలో నాకుల రంగున లేబసరు వర్ణము మొదలు కారుపసర రంగు వరకును నంతర భేదములు గానగును.

పూవులు, బంతి పూవులను బోలి చెండ్లుగా నుండును. మన మొక పూవుగ పరిగణించునది నిజముగ ననేక పూవుల గుచ్ఛమే. ఈ గుచ్ఛములు ప్రకాండము యొక్కయు, ప్రతి కొమ్మ యొక్కయు చివర నొక్కొకటి బయలుదేరును. గుచ్ఛములకు క్రింద నుండు వృంతములు సామాన్యముగ వాని క్రింద నుండు నాకులను బోలియే యుండును. కాని

28 వ పటము.



కుసుంబాపూవు (గుచ్ఛము) క్రింది వృంతదళములతో సహా (½ ఆకృతి)



29 వ పటము. విడిపూవు (సహాజాకృతి)

కొన్ని రకములలో నీ వృంతదళ ములు మొనలుదేరి యుండక కొంచె మించు గుండ్రముగ నుం డును. గరిలేక సమాంచలముగ నుండుటయు గలదు. గుచ్ఛము నందలి యొక పూవును విడదీసి పరీక్షించుచో నందలి దళవలయ మొక నిడివియైన గొట్టముగ నేర్పడి చివర నైదు చిన్న ఆక ర్షక పత్రము లుండును. వాని నడుమ యంత కంటె కొంచెము పొడవుగ నెదుగు సన్నని కీలాగ్రపు కొన గాన్పించును. దళవలయపు గొట్టమునకు గ్రింది భాగమున గింజను బోలిన యండకోశము గాన వచును. ఆకర్షకపత్రములు సామా న్యముగ పసిమివర్ణము గలిగి గాని, పసిమి వర్ణముతో గూడిన నారింజ

లేక యెరుపు వర్ణము గలిగి గాని యుండును. కొంచె మించుమించు తెలుపుగ నుండు రకములు గూడ కొన్ని గలవు. పూవు వడలిన కొలదిని మొదట తెల్లగగాని, లేబసిమిగ గాని యుండిన వానిలో లేతయెరుపు లేక యెరుపుతో గూడిన పసిమి రంగును, మొదట ముదురు పసిమి రంగు గాని, పసిమితో గూడిన యెరుపు రంగు గాని గల వానిలో తేటైన యెరుపు రంగును వచ్చును.

పుష్ప గుచ్ఛములలో వెలుపలి యంచున నున్న పూవులే ముందుగ వికసును. క్రమముగ నీ విడుపు లోపలికి వ్యాపించును. మొత్తము మీద సుమారు నాలుగు రోజులలో నొక చెండు నందలి పూవు లన్నియు వికసించును. ప్రకాండపు కొన యందు తొలిచెండు పుట్టును. పిమ్మట మొదట పుట్టిన కొమ్మ లందును, తరువాత వెనుక పుట్టిన కొమ్మ లందును రెమ్మ లందును చెండ్లు పుట్టును. కాని మొదటి చెండు పుట్టిన సుమారు 3_5 వారములలో మొక్క పూత పూర్తియగును. పూవులు గర్భవతు లగుటకు తేనెటీగలు తోడ్పడును. అవి చాల భాగము ఆత్మసంపర్కము వలననే గర్భవతు లగును. కాని కొన్ని పర సంపర్కమునకు గూడ లోనగుట గలదు. పూసా పరిస్థితులలో నూటికి సుమారు 16 వంతుల వరకు నిట్లు పర సంపర్కము వలన గర్భవతు లైనట్లు తేలెను<sup>38</sup>. కుసుంబా విత్తులు గొలుగు గింజల వలె తెల్లగను, నున్నగ నుండు ఫలకవచము గలిగి వానివలెనే కొంత గట్టిగ నుండును. తులమునకు సుమారు 200_400 గింజలవరకు తూగు రకములు గలవు. ఈ గింజలు తేలిక. క్వంచమునకు సుమారు $6\frac{1}{2}$ పౌనులు తూగును. పూసాలో పరీక్షింప బడిన గింజలలో చమురు నూటికి సుమారు 20_30

30 వ పటము.



కుసుంబా గింజ (ఫలము) రెట్టింపు

వంతుల వర కుండెను. అరుదుగ కొన్ని చోట్ల పండిన మంచి రకముల పంటలో చమురు నూటికి సుమారు 35వంతుల వర కుండుట గలదు.

పైని సూచింపబడిన లక్షణము లందలి భేదములను బట్టి కుసుంబా లలో పెక్కు రకములు గుర్తింపబడు చున్నవి. పూసా పరిశోధనా స్థానమున నాయా రాష్ట్రము లందు సాగునం దుండిన రకములను సేకరించి పరీక్షింపగా నందు ప్రత్యేక లక్షణములు గల 24 రకముల మొక్కలు గుర్తింపబడెను. కాని యిందు దక్షిణ యిండియాలోని రకములు జేరి నట్లు గాన్పింపదు.

పుష్పగుచ్ఛమునకు దిగువ నుండు వృంతదళముల స్వభావమును బట్టి కుసుంబా రకములను రెండు ముఖ్య తరగతులుగ విభజింపవచ్చును. ఈ దళములు బల్లెపాకారము గలిగి ముండ్లుదేరి యుండు రకము లొక తరగ తిలో జేరును. ముండ్లంతగాలేక వెడల్పుగ గాని, మొనలు గుండ్రజేరి గాని యుండు వృంతదళములు గల రకము లొక తరగతిలో జేరును. ఈ రెండు తరగతులలోను మరల పూవు లందు — మొగ్గ యందు విడచినపుడు — వాడినపుడు — గల రంగు భేదములను బట్టియు, పంట కాలమును బట్టియు మరల కొన్ని యుపతరగతు లేర్పరుప బడవచ్చును.

ఆంధ్రదేశము నందు కుసుంబా సాగు గల రాయలసీమలో రెండు ముఖ్య రకములు గుర్తింపబడు చున్నవి. అందొకటి పైని పేర్కొనబడిన మొదటి అనగా ముండ్లు గల తరగతి లోనిది. దీని పూవులందలి రేకులు పసుపుపచ్చగ నుండును. ఈ రకము గింజల కొరకే సాగు చేయబడు

యున్నది. మొక్క యెత్తు మధ్యమము. కొమ్మలను, రెమ్మలను గూడ పెట్టి పక్కలకు వ్యాపించును. ఈ గింజలు క్రింద జెప్పబడు రకపు గింజల కంటె చిన్నవి. ఇంచుక బూడిద బారిన తెలుపు రంగు గలిగి యుండును. రెండవ రకము ముండ్లంతగా లేనిది. దీని పూవు లందలి రేకులు యెరుపుతో గూడిన పసిమి వర్ణము (నారింజ వర్ణము) గలిగి యుండును. గింజలు పెద్దవి. తేటయిన తెలుపు రంగు గలిగి యుండును. ఈరకము సామాన్యముగ రేకులందలి రంగుద్రవ్యముకొరకే సాగుచేయబడు చున్నది. కాని యిటీవల కృత్రిమములగు అనిలైన్ రంగుల(Aniline dyes) పోటీవలన నీ రంగుద్రవ్యపు టుత్పత్తి చాలవరకు తగ్గింపబడెను. పూవులు గర్భవతులైన పిమ్మట నందలి రేకుల నేరినను నవి గింజ పోసికొనుటచే రంగు కొరకు పెంచిన సస్యమునుండి కూడ గింజలు లభించును.

## సాగునకు దగిన పరిస్థితులు.

కుసుంబా నూవు, వలిసెవలె నన్నికాలములందును సాగు చేయదగినది కాదు. సెనగ, అవిసె మొదలగు వాని వలె నిది శీతకాలమున మాత్రమే బాగుగ పెరుగును. అక్టోబరు-నవంబరు నెలలు దీనిని జల్లుటకు యుక్త కాలము. కొన్ని చోట్ల నింత కంటె యాలస్యముగ (డిసెంబరులో) జల్లుటయు గలదు.

శీతకాలపు పంట యగుటచే కుసుంబాకు తేమను పట్టియుంచు కృష్ణ రేవడి నేలలనుకూలములు. కావుననే నిది యట్టి నేలలు మెండుగ గల రాయలసీమలో మాత్రమే సాగునం దున్నది.

అరవనాడున నల్లరేగడ నేలలు గల తిర్నల్వేలి జిల్లా యందు గూడ నీ సాగు గలదు. బొంబాయి రాజధానిలోను, మధ్యరాష్ట్రము లందును నల్లరేగడ నేలలు గల చోట్లనే యిది హెచ్చుగ పైరు చేయబడు చున్నది. బంగాళారాజధానిలోను, సంయుక్తరాష్ట్రము లందును మాత్ర మీ సస్యము పదును నిలచు వండలి నేల లందును, యిసుకకోడి నేల లందును గూడ సాగునం దున్నది. పదును చాలనపు డట్టి నేలలం దీ చేలకు నీరు కట్టుట యవసర మగును. కట్టనిచో పంట తగ్గిపోవును.

## సేద్యవిధానము.

కుసుంబాను ప్రత్యేకముగ సాగుచేయుట యరుదు. దీనితో సామాన్యముగ కలిపి సాగు చేయబడు సస్యము సెనగ. జొన్నతోను, గోధుమతోను గూడ కలిపి సాగుచేయుటయు గలదు. అరుదుగ దీనిని ధనియముతో గలిపి సాగుచేయు ప్రదేశములు గూడ గలవు. బొంబాయి రాజధానిలో దీనిని కొన్ని కాయధాన్య జాతులతో గూడ కలిపి సాగు చేయుదురు.

పైని వ్రాసినట్లు మిశ్రమముగనే గాక దీనితో సమకాలికములగు సెనగ, గోధుమ మొదలగు చేల చుట్టును కొంత వెడల్పున దీనిని జల్లువాడుక గూడ గలదు. కొద్ది గొప్ప ముండ్లుండుటచే నీ చేను మధ్యగ నున్న సస్యములను పశువుల నుండి కొంత వరకు కాపాడును. అరుదుగ కుసుంబాలను ప్రత్యేకముగ జల్లుటయు గలదు.

సామాన్యముగ తొలకరిలో నొక తృణధాన్యమును పైరు చేసి కోసి కొనిన పిమ్మట దీనిని పెట్టుదురు. ఇట్లు కాక తొలకరి నుండియు నేల నప్పుడప్పుడు దున్నుచు వచ్చి దీనినే ప్రధాన సస్యముగ బెట్టుటయు గలదు. కుసుంబాను 2-3 సం|| లు వరుసగా సాగుచేయుచో నా నేలయందు పంట చాల తగ్గునందురు. మధ్య కాలమున కృష్ణరేవడి నేలలలో ప్రత్తి, కొఱ్ఱ, జొన్న, సెనగ మొదలగు వానిని పైరు చేయదగును.

ప్రత్యేకముగ సాగు చేయు నెడల కుసుంబా పైరు కొఱకు తొలకరి నుండియు నేలను దున్ని సిద్ధము చేయుటయే మంచిది. కాని తొల కరిలో నొక తృణధాన్యమును సాగు చేయుచో దానిని సాధ్యమయినంత ముందుగ విత్తి దానిని కోసి నప్పటి నుండియు నేలను బాగుగ దున్ని సిద్ధము చేయవలెను.

కృష్ణరేవడి నేలలలో కుసుంబా కెరువు వేయు టరుదు. కాని యిది నేల నుండి కొంత సారమును దీసివేయు సస్య మగుటచే పశువుల యెరువు గాని, పెంట గాని (ఎకరమునకు సుమారు 5-6 బండ్లు) వేయుట మంచిది. ఇసుకోడి నేలలలో తగినంత యెరువు వేయకుండ నీ సస్యమును సాగు చేసిన ప్రయోజన ముండదు.

కుసుంబాలను ప్రత్యేకముగ జల్లునెడల విత్తులను వెదజల్లి నాగటితో కలియదున్నవచ్చును. లేక గొఱ్ఱుతో సుమారు 18-24 అంగుళముల దూర మున వరుసలుగా విత్తి పైని గుంటకను దోలవచ్చును. భూస్వభావమును బట్టి యెకరమునకు సుమారు 6-10 సేర్ల (10-16 పౌనుల) గింజలను జల్ల దగును.

కుసుంబాల నితర సస్యములతో కలిపి సాగు చేయుచో గింజల నా విత్తులతో గలిపియే జల్లుటయు ప్రత్యేకపు వరుసలలో జల్లుటయు గూడ గలదు. బళ్ళారిజిల్లాలో కుసుంబాలను జొన్నలతో కలిపి ప్రతి వరుసలోను విత్తుచు, ప్రతి 3 వ లేక 6 వ వరుసలోను నీ రెంటను గాక సెనగ గూడ కలిపి విత్తబడును. సామాన్యముగ నిట్లు విత్తునపుడు సుమారు 3_5 సేరు కుసుంబా విత్తులు పట్టును. చల్లిక యాలస్యమగుచో జొన్న చేను బాగుగ పెరుగదు గాన నపుడు సెనగలను, కుసుంబాలను గూడ నింకను హెచ్చుగ గలుపుదురు. ప్రత్యేకపు వరుసలలో జల్లుచో మూడేసి వరుసల కుసుంబాయును, 6_15 వరుసలను ఇతర సస్యములను వేయుచుందురు. ఇట్లు విత్తుచో కుసుంబా వరుసల యెడమును బట్టియు, గింజలను వేయు ఒత్తును బట్టియు సుమారు 1½-3 సేర్ల గింజలు పట్టును. ఇతర సస్యముల రక్షణ కొరకు వేయుచో వాని చుట్టును 12_ 15 వరుసలలో కుసుంబాలను ప్రత్యేకముగ విత్తవచ్చును.

కుసుంబాల నితెర సస్యములతో కలిపి వరుసలుగ జల్లినపుడు వానితోపాటే దీనికిని నాంతరికృషి జరుగును. ప్రత్యేకముగ సాగు చేయునెడల దీనికి వరుసల మధ్య రెండు సార్లు పాపటముతోలుట మంచిది. పెద జల్లుచో నొక సారి గొప్పు త్రివ్వవలెను.

మొక్కలు కొమ్మలను, రెమ్మలను హెచ్చుగ బెట్టునట్లు చేయుటకై కొంతవర కెదిగిన పిమ్మట వానితలలను త్రుంచివేయుట కొన్నిచోట్ల గలదు.

తేలిక నేలలలో నిదివరలో సూచింపబడిన ట్లొక్కొకప్పుడు నీరు కట్టుట యావశ్యము గావచ్చును. సామాన్యముగ 3_4 తడులు కావలసి యుండును.

పూర్తకాలమున గురియు వర్షము- ముఖ్యముగ రంగు దినుసు కొరకు పెంచబడు పైరునకు- ముఖ్యావశ్యకము. తెలుగు జిల్లాలలో నీ సస్యమునకు బట్టు చీడలును, తెగుళ్లును అంతగా లేవు.

## కోత, కైలు వగైరా.

గింజలు దీయదలచుచో సస్యము బాగుగ పండిన వెనుక మొక్కలను మొదటికి గోసి యెండనిచ్చి కళ్లమున జేర్చి పరచి మరికొంత యెండిన వెనుక కర్రలతో గొట్టవలెను. చేను విస్తారముగ నున్న యెడల పశువులచే ద్రొక్కించ వచ్చును. పసరుగ నున్నపుడు ఆకులపై ముండ్లు బిరుసుగ నుండి గ్రుచ్చుకొనినను వడలిన పిమ్మట నా బిరుసుదనము తగ్గిపోయి పశువులకును, మనుష్యులకును నంతగా గ్రుచ్చుకొనవు.

పొట్టు వగైరాలు పోవుటకు చేటలతో నెగురబోసియు తుడకు జెరిగియు గింజలను పరిశుభ్రపరచ వలెను.

ప్రత్యేకముగ సాగు చేయబడు సస్యము నుండి సామాన్యముగ 60-90 కుంచముల* (400-600 పౌనుల) గింజలు కావచ్చును. సుమారు 1000 పౌనుల వరకయిన నిదర్శనములు గలవు. మిశ్రణముగ సుమారు 20-40 కుంచముల (125-240 పౌనుల) వరకు కావచ్చును.

కుసుంబాను రంగుదినుసుగ సాగుచేయుటను గూర్చియు, పూవులనుండి రేకులనేరి సరకు చేయుటను గూర్చియు రంగుదినుసులను గురించిన గ్రంథముల వ్రాయబడును.

---

* కుసుంబా గింజలు కుంచము 1 కి సుమారు 6½ పౌనులు తూగును.

ఒక యెకరము కుసుంబా సాగున కగు వ్యయమును, సంమవలన వచ్చు నాదాయమును ఈ క్రింద యంచనా వేయబడెను.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు ప.జ. | మ. | ఆ ‡ | వ్యయము రు.అ.పై |
|---|---|---|---|---|---|
| అక్టోబరు | దుక్కి-2 సార్లు | 3 | 3 | | 3 0 0 |
| | గుంటకతోలుట_2 సార్లు | 1 | 1 | | 1 0 0 |
| | యెరువు 5 బండ్లు_తోలుట, పర చుట(సగము వ్యయము) | ½ | ¾ | ¼ | 1 10 6 |
| నవంబరు | దున్నుట-1 సారి | 1½ | 1½ | | 1 8 0 |
| | గుంటక తోలుట | ½ | ½ | | 0 8 0 |
| | విత్తులు-8 సేర్లు | | | | 0 12 0 |
| | గొర్రుతో విత్తి, గుంటక తోలి కప్పుట | 1 | 1½ | | 1 2 0 |
| | గొప్పు త్రవ్వుట | | 1 | 12 | 1 12 0 |
| | కోత, కైలు వగైరా | 1 | 2 | 8 | 2 12 0 |
| | పన్నులు (సగము) | | | | 2 0 0 |
| | మొత్తము | 8¾ | 11¼ | 12¼ | 16 0 6 |

‡ ప.జ. = పశువులజతలు; మ. = మగవాండ్రు; ఆ. = ఆడువాండ్రు.

రాబడి ... రు.అ.పై

గింజలు 75 కుంచములు (500 పౌనులు) రు 1కి

$3\frac{1}{2}$ కుంచముల ($2\frac{2}{3}$ పౌనులు) చొ॥ ... 21 6 10

కంప_1000 పౌనులు ... 1 0 0

మొత్తము ... 22 6 10

నికరాదాయము ... 6 6 4

## చమురుదీయుట, ఉపయోగము.

గృహోపయోగమునకు చమురును స్వల్పముగ దీయుచో గింజలను దంపి పై పొట్టు పోవునట్లు చేసి లోని పప్పును పిండిగా గొట్టి గాని, కొంచెము నీటితో రుబ్బి గాని 2 వ యనుబంధమున వివరింపబడిన వంట పద్ధతిని దీయవచ్చును. కాని సామాన్యముగ నూవు పప్పు నుండి వలెనే ఈ పప్పు నుండియు దేశవాళీ గానుగలలో చమురు దీయుటయే వాడుక.

దినుసు తగినంత యున్నపుడు నొక్కుడు యంత్రము లేదు నిప్పు సెగ సహాయమున గూడ చమురు దీయబడు చున్నది. కాని యిట్లు తీసిన చమురు ఆహారయోగ్యము గాదు.

పై పెంకు పలుచగ నుండి నూటికి సుమారు 30 వంతుల చమురుండు రకముల గింజల నుండి నూటికి సుమారు 65 వంతుల పప్పు దిగుబడి యగును. ఈ పప్పును దేశవాళీ గానుగలలో నాడుచో నూటికి సుమారు

35వంతుల చమురు దిగుబడియగును. గింజల తూకముపై చమురు సుమారు 22½ వంతులు మాత్రమే దిగుబడి యగును. యంత్ర సహాయమున హెచ్చు వేడిమితో తీయుచో నింత కంటె కొంచెము హెచ్చు దిగుబడి యగును. పెంకు దళముగనుండి, చమురు తక్కువగ నుండు రకములలో పప్పు దిగుబడియు, చమురు దిగుబడియు గూడ తక్కువ.

రెండుదినుసుల కుసుంబాల సంఘట్టనము I-A అనుబంధమున తెలుపబడెను. ఒకదానిలో చమురు తక్కువగను, మరియొక దానిలో హెచ్చుగను గలదు. తక్కువ చమురు దినుసులతో బోల్చిన నిందు చమురును, మాంసకృత్తులును గూడ తక్కువ. సారపదార్థము హెచ్చు.

దేశవాళీ గానుగలలో పరిశుభ్రముగ దీయబడు కుసుంబా నూనె యించుక పసిమి వర్ణము గలిగి తేటుగా నుండు స్థిర తైలము. మానవాహారమునకు తగియుండును. ఈ పంట గల దేశములలో నీ చమురు నూవుల నూనెకును, నేతికిని బదులుగ నుపయోగింపబడు చున్నది.

కుసుంబా నూనెకు శోషక స్వభావము కొంచెము గలదు గాని వివిధ రంగులతో గలిపి యుపయోగింప దగినంతగా లేదు. కావున నిది రంగు పరిశ్రమయందు దరుదుగనే - ముఖ్యముగ కొంత యవిసె నూనెతో గలిపి - యుపయోగింపబడు చున్నది.

మరుగుచున్న కుసుంబా నూనెను చల్లని నీటిలో వేసిన యెడల రబ్బరు వంటి ద్రవ్య మొకటి యేర్పడును. దీనిని అద్దములను బిగించుటకు గాని, గోడలకు పలకరాళ్ల నతికించుటకు గాని మక్కువగా నుపయోగింతురు.

ఇట్లుపయోగించు నప్పుడు దీనితో నాలుగు వందల పాళ్లకొక పాలు ఉల్లి పాషాణము కలిపిన యెడల నీ మక్కునకు పురుగు పట్టదు. ఈ చమురును మందాగ్నిపై సుమారు 4 గంటల వరకు కాచి గుడ్డలకు రాచిన యెడల వానికి తడి యంటదు. డ్రిల్లు(Drill)గుడ్డలకు గాని, నారగుడ్డ(Canvas)లకు గాని యిట్లు కాచినచమురును కుంచెతో రాచి యారనిచ్చుచో నీరు పీల్చని (Water proof) గుడ్డ తయారగును.

పప్పు చేసి చమురు దీసిన కుసుంబా పిండిని పశువులకు బెట్టవచ్చును. పెంకుతో నున్న పిండిలో నారపదార్థము హెచ్చుగ నుండుటచే నది జీర్ణమగుట కష్టము. అందలి మాంసకృత్తులును తక్కువ. I-C అనుబంధము జూడుడు.

పెంకు తీయని పిండిని, తీసిన దానిని గూడ యెరువుగ నుపయోగింపవచ్చును. పెంకు తీసిన దానిలో నత్రజని నూటికి 5 కు మించి యుండును. తీయని దానిలో నిందు సుమారు సగము మాత్ర ముండును.

కుసుంబా కంపను కాల్చిన బూడిదలో పొటాషు విస్తారముగ నుండును. కావున కొందరు కుంకుడుకాయకు బదులు దీని నొడలు రుద్దుకొనుట కుపయోగింతురు.

---

# ఆముదము.

**Castor–Ricinus communis, N. O. Euphorbiaceae.**

అరవము_ఆమనక్ లేక కొట్టైముత్తు; మళయాళము-ఆవనక్కు;
కన్నడము-హరలు; ఓఢ్రము_కల్లా; హిందీ-రేండీ; సంస్కృతము-ఏరండః.

## చరిత్ర, వ్యాపకము.

ఆముదపు మొక్కకు ఆఫ్రికా ఖండమందలి యుష్ణమండలము స్వస్థానమని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఆబిసీనియా దేశమున నిప్పటికిని యీ జాతి మొక్కలు వన్యస్థితి యందు గానవగును. ఆఫ్రికా నుండి యిది ఆసియాకును, ఐరోపా దక్షిణ భాగమునకును వ్యాపించి యుండును[1]. కొంద రిండియా కూడ ఆముదమునకు స్వస్థానమయి యుండవచ్చు నందురు. స్వస్థానము కాకపోయినను నిండియాలో నీ సస్యము చాల పురాతన కాలము నుండియు సాగునం దుండె ననుటకు సందేహము లేదు. సూత్రయుగ కాలపు నాటికే నిది యిండియాలో సాగునం దుండెనని ప్రాచీన నార్యవాఙ్మయమున తెలుపుచున్నది.

ఇపుడు ఆముదములు ఇండియా, చీనా, జపాన్, పర్షియా, అరేబియా దేశములలోను, దక్షిణ ఐరోపా ఖండము నందును కొంత విరివిగ సాగు చేయబడు చున్నవి.

ఇండియాలో ఆముదముల సాగు విరివిగ గల ప్రదేశములలో నైజాం రాష్ట్రములు అగ్రస్థానము వహించుచున్నవి. చెన్న రాష్ట్రము దాని తరువాతిది. మైసూరు మూడవది. తక్కిన రాష్ట్రము లందును, సంస్థానము లందును నీ సాగు స్వల్పము. 1940_41 వ సంవత్సరమున మొత్తము మీద నీ దేశమున నాముదములు సుమారు 10 లక్షల యెకరముల పై సాగు చేయబడెను. ఆయా రాష్ట్రము లందలి విస్తీర్ణము క్రింది పట్టికలో జూపబడెను.

| రాష్ట్రములు | 1940-41 వ సంవత్సరమున విస్తీర్ణము_ఎకరములు (వేలు) | గింజల పంట-టన్నులు (వేలు) |
|---|---|---|
| నైజాంరాష్ట్రములు | 4,31 | 39 |
| చెన్నపురిరాజధాని | 2,67 | 27 |
| మైసూరు సంస్థానము | 1,04 | 8 |
| బరోడాసంస్థానము | 50 | 5 |
| బొంబాయిరాజధాని | 41 | 6 |
| బొంబాయిరాజధానిలోనిసంస్థానములు | 34 | 5 |
| బీహారు | 33 | 4 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 29 | 5 |
| ఇతరరాష్ట్రములు | 32 | 6 |
| మొత్తము | 10,21 | 105 |

మొత్తముమీద నీదేశమున నాముదముల సాగు యిటీవల చాలవరకు తగ్గిపోయెను. 1921-22 వ సంవత్సరమున నీ సస్యము పైరు చేయబడిన విస్తీర్ణము సుమారు 18 లక్షల యెకరము లుండెను. 1932-33 వ సం॥ న సుమారు 16 లక్షల యెకరము లుండెను. ఇటీవల సుమారు పది లక్షలకు తగ్గెను. చెన్నరాజధానిలో నీపంట 1895-96వ సం॥ న సుమారు $7\frac{1}{2}$ లక్షల యెకరముల నాక్రమించెను. 1917-18 వ సం॥ నాటికి సుమారు 5 లక్షల యెకరములకు దిగిపోయెను. ఇటీవల నిందు సుమారు సగమునకు దిగిపోయెను. దీపములకు కెరోసిన్‌నూనె యుపయోగము సర్వసామాన్యమగుటయు నాముదము కంటె హెచ్చు పంట నిచ్చు వేరుసెనగ సాగు వ్యాప్తి నొందుటయు నిందుకు గారణములు.

చెన్నపురి రాజధాని యందలి ప్రస్తుతపు ఆముదపు సాగు సగటు విస్తీర్ణము 2,60,670 ల యెకరములలో 2,21,580 ల యెకరములు అనగా నూటికి కెనుబది వంతులకు పైగా తెలుగు జిల్లాలోనివే. జిల్లావారీ విస్తీర్ణమీ క్రింద జూపబడెను.

| జిల్లా | సగటు ఆముదపు సాగు విస్తీర్ణము—ఎకరములు | పంట-టన్నులు |
|---|---|---|
| అనంతపురం | 68,300 | 4,570 |
| నెల్లూరు | 41,500 | 4,610 |
| గుంటూరు | 29,300 | 3,270 |
| కర్నూలు | 29,200 | 1,960 |
| బళ్ళారి | 18,900 | 1,270 |
| మొత్తము | 1,87,200 | 15,680 |

| జిల్లా | సగటు ఆముదపు సాగు విస్తీర్ణము—ఎకరములు | పంట—టన్నులు |
|---|---|---|
| వెనుకటిపుటనుండి | 1,87,200 | 15,680 |
| కృష్ణా | 7,310 | 820 |
| కడప | 8,950 | 600 |
| తూర్పుగోదావరి | 7,720 | 860 |
| చిత్తూరు | 4,970 | 560 |
| పడమటిగోదావరి | 4,430 | 490 |
| విశాఖపట్నం | 1,000 | 110 |
| మొత్తము | 2,21,580 | 19,120 |

కొంత కాలము క్రిందట నాముదపు సాగు హెచ్చుగ నుండి యిపుడు తగ్గిన జిల్లాలో గుంటూరు, కృష్ణా, విశాఖపట్నం జిల్లాలు పేర్కొనదగినవి. గుంటూరుజిల్లాలో 51 వేల యెకరములనుండి 29 వేలకును, కృష్ణజిల్లాలో 15 వేల యెకరములనుండి 7 వేలకును, విశాఖపట్నం జిల్లాలో 11 వేల యెకరముల నుండి 1 వేయికిని తగ్గెను. తగ్గుదల రాయలసీమలో స్వల్పము. తక్కిన జిల్లాలలో మధ్యమము.

## ఆముదపు మొక్క లక్షణములు, రకభేదములు.

ఆముదపు మొక్క పెద్ద ఉసిరిక చెట్టు, కరివేపెండలము మొదలగునవి జేరియున్న చెముడు (Euphorbiaceae)కుటుంబము లోనిది. సామా

న్యముగ నేకవార్షికముగనే పైరుచేయబడును 3-10 అడుగుల యెత్తుమాత్ర మెదిగినను, ఉష్ణమండలమున కొన్ని రకములు అనుకూల పరిస్థితులందు బహువార్షికముగ బెరిగి మాను కట్టి సుమారు 10-30 అడుగుల యెత్తునకు గలదు.

తల్లి వేరు గాని, పిల్ల వేళ్లు గాని, మొక్క యొక్క పై పెరుగుదల నదగినంతగా వ్యాప్తి జెందక పోయినను, నేలయందు పదును క్రిందికి పోయిన కొలదిని నివియు లోతుగ బోయి మొక్కకు వలయు తేమను సంపాదింప గలుగును.

పెక్కు సంవత్సరములు పెరిగిన చెట్లు ప్రకాండము సుమారు 3-4 అంగుళముల లావు వర కెదిగినను నేకవార్షికముగ బెంచిన వానిలో నిది సుమారు 1-1½ అంగుళముల కంటె లావు కాదు. ఎండిన కాండము సామాన్యముగ గుల్లబారును. గట్టితనమును తక్కువ.

ఏకవార్షికముగ సాగు చేసినపు డాముదపు మొక్క క్రింది భాగమున కొమ్మల నంతగా బెట్టదు. పైని మాత్రము పూతకొమ్మలు కొన్ని బయలుదేరును. విడి మొక్కలను బహువార్షికముగ నెదుగనిచ్చినపు డితర చెట్లవలెనే నిదియు కొంత క్రిందినుండియు తిన్నగ నెదుగు గొన్ని శాఖలను బెట్టును. లేతగనున్నపుడు కొన్నిరకములలో కాండము కొంత యెరుపురంగు గలిగి యుండును. కొన్నిటిలో నాకుపచ్చగనే యుండును. కొన్నిటిలో నీ రెంటి యొక్కయు వివిధ వర్ణముల మిశ్రమముగ నుండును. ఎరుపురంగున్నను లేకపోయినను గూడ కాండముపై సామాన్యముగ నొక విధమగు బూడిద వర్ణము గల మైనపుపూత యుండును.

23 వ పటము.



ఆముదపుటాకు
($\frac{1}{5}$ ఆకృతి)

29 వ పటము.



ఆముదపు గెల
($\frac{1}{8}$ ఆకృతి)

ఆకులు తాళపత్రి వైఖరిని (Palmate) సామాన్యముగ 7-9 తమ్మెలుగ జీలి యుండును. ఇంకను హెచ్చు తమ్మె లుండుట యుగలదు తమ్మెలకొనలు సన్నగిలి యుండును. అంచులు రంపగరి గలిగి యుండును. తొడిమ సామాన్యపు టాకులవలెనే పత్రిపు టంచున గాక తామరాకు వలె కేంద్రమున కంటి యుండును.

పూవులు రెమ్మల చివర నిడివియైన గుత్తులు (రెమ్మగెలలు)గ నమరి యుండును. గెల యడుగున మగ పూవులును, పైన ఆడు పూవు

30 వ పటము-ఆముదపుపూవులు





మగపూవు ఆడుపూవు
(రెట్టింపుఆకృతులు)

లును వేర్వేరుగ నుండును.* మగపూవు నందు 3_5 రక్షక పత్రము లుండును. ఆకర్షక పత్రము లుండవు. కింజల్కములు అనేకములు. గుచ్ఛములుగ నుండును. ఆడు పువ్వులు 3-5 తమ్మెలు గలిగి యుండును. త్వరలో రాలిపోవును. ఆకర్షక పత్రము లుండవు. అండకోశము 3 అరలు గలిగి యుండును. రెండేసి శాఖలుగ చీలిన 3 కీలము లుండును. రెండు విధములగు పూవులును ఉత్తర హిందూస్థానపు పరిస్థితులలో కొంచెమించు మించు ఒకే సారి వికసించుననియు, పుప్పొడి మధ్యాహ్నపువేళ (11_2 గంటల మధ్య) వెలువడుననియు కనిపెట్టబడెను. ఒకే గెలయందలి మగ పూవులు గాని, ఆడు పూవులు గాని ముదిరి విడుచుటకు కొన్ని దినములు పట్టును. సామాన్యముగ ఏ చెట్టు నందలి ఆడు పూవులు ఆ చెట్టు నందలి మగపూవు లందలి పుప్పొడి వలననే గర్భవతు లగుచుండినను మొత్తముమీద నూటికి సుమారు 5 వంతుల వరకు పూవులు పరసంపర్కము వలన గూడ గర్భవతు లగునని కనిపెట్టబడెను.[42]

---

* అరుదుగ మగ పూవులును, ఆడు పూవులును వేర్వేరు మొక్కలందు ప్రత్యేకముగ నుండుటయు, మిథున పుష్పములు బయలుదేరుటయు, మొదట నాడుపూవులుగ నుండి పిమ్మట మగపూవులుగ మారుటయు గూడ సంభవించునని కనిపెట్టబడెను.[42]

31 వ పటము.



ఆముదపు కాయ
(సహజాకృతి)

ఆముదపు కాయ మూడరలును, ఒక్కొక్క యరలో నొక్కొక్క గింజయు గలిగియుండును. అరుదుగ 2, 4, 5 అరలు, గింజలుగల కాయలు బయలుదేరుటయు గలదు. కాయలపైని మెత్తని ముండ్ల వంటి యంగము లుండును. కొన్నిరకముల యాముదపుకాయ లెండిన వెనుక ప్రేలుడు కాయల వలె తటాలున పగులుటచే గింజలు కొంత దూరము విసరి వేయబడుచుండును.

32 వ పటము.



ఆముదపు గింజలు
(సహజాకృతి)

ఆముదపు గింజపై పొర పెంకు కట్టి కఠినముగ నుండును. పైని వివిధముగ చిత్రింపబడిన నలుపు, యెఱుపుతో గూడిన గోధుమ లేక దూసర వర్ణము గలిగి యుండును. గింజలలోని పప్పు (బీజదళములు) కొంచె మించుమించు తెలుపుగగాని, యించుక పసిమి వర్ణముతో గాని యుండును. బీజదళము దళసరిగా నుండుటచే ఆముదపు గింజల చైతన్యము త్వరలో చెడదు. ఒక్కొక్కప్పుడు చల్లిన విత్తులకు పదును ననుకూలముగ కుదురని యెడల నవి నేలలో నట్టే యుండి 1-2 సంవత్సరములకు తరువాత నైనను మొలచుచుండును.

25

గింజల పరిమాణము, మొక్కలు పూయుటకును, ఫలించుటకును పట్టు కాలము, కాండపురంగు మొదలగు లక్షణములనుబట్టి ఆముదములలో ననేక రకములు గుర్తింపబడు చున్నవి. గింజల పరిమాణమును బట్టి యాముదములు సామాన్యముగ చిట్టాముదములు, పెద్దాముదములు, నడుపులు అని మూడు ముఖ్యతరగతులుగ పరిగణింపబడు చున్నవి. చిట్టాముదపు గింజలు ఔన్సుకు సుమారు 200-300 వరకు తూగును. పొలము గట్లమీద బహువార్షికములుగ గాని, మెట్ట సస్యములతో మిశ్రమముగ నేకవార్షికముగ గాని పైరు చేయబడు చుండును. పెద్ద ఆముదపు గింజలు ఔన్సుకు సుమారు 80-120 వరకు తూగును.* సామాన్యముగ కోరళ్ల ప్రక్కలను, పొలము గట్టు మీదను, చెరకు తోటలు మొదలగు వాని యోరలను బహువార్షికములుగ పైరు చేయబడు చుండును. నడుపులు పై రెండు తరగతుల గింజలకును మధ్యమ పరిమాణము గలిగి యుండును. ఏకవార్షికముగ మాత్రమే సాగు చేయబడు చున్నవి. వీనికి రాయలసీమలో చెన్నాముదాలని పేరు గలదు. కొన్ని చోట్ల నిందు మరల రేవడి ఆముదాలనియు, గరప ఆముదాలనియు రెండు రకములు పరిగణింపబడు చున్నవి.

పైని పేర్కొనబడిన మూడు తరగతులలోను గూడ కాండపు రంగును బట్టియు, కాయలు పైని నున్నగ నుండుటను బట్టియు, లేకుండుటను బట్టియు కొమ్మలను విస్తారముగ బెట్టుటను బట్టియు పెట్టకపోవుటను బట్టియు,♦ ప్రభుత్వ పరిశోధనా స్థానములం దనేక రకములు ఏర్చి తీయ

---

* ఆఫ్రికాలో ఔన్సుకు సుమారు 35-40 మాత్రమే మిగుల పెద్ద గింజలు గల రకములు గలవట.[7]

♦ ఒక మొక్క కొమ్మలను హెచ్చుగ బెట్టి సుమారు 90 గెలలకు పైగా వేసియుండెనట.[42]

బడి పరీక్షింపబడు చున్నవి. గెలలు వేయుటకు పట్టు కాలము నందును, కాయ లెండిన వెనుక తనంతట తాను పగులుటను బట్టియు పగులక పోవుటను బట్టియు గెలలందు కాయలు దగ్గరగ గాని, దూరముగ గాని యమరి యుండుటను బట్టియు గూడ రకముల నేర్చి తీయుచున్నారు.

మొక్కలు గెలలు వేయుటకు పట్టు కాలము రకముల బట్టియే గాక విత్తు కాలమునుబట్టి కూడ నుండును. ఒకేసారి నాటి చేసిన యొక తణిఖీలో నాయా రకములు 5 మొదలు 15 వారములలో గెలలు వేయ నారంభించెను. కొమ్మలను విస్తారముగ బెట్టు రకముల కంటె తక్కువగ పెట్టి పెద్ద గెలలను వేయు రకములే మొత్తముమీద హెచ్చు పంట నిచ్చునని కనిపెట్ట బడెను.[42] సామాన్యముగ కాయలు దగ్గరగ నమరియుండు* గెలలను వేయు రకములును, కాయలు తమంతట తాము పగులని రకములును వ్యవసాయమునకు బ్రశస్తముగ నెంచదగి యున్నవి. సామాన్యముగ చిన్న గింజలలో హెచ్చు చమురుండుటచే నిట్టి గింజల రకములు ప్రశస్తముగ నెంచబడు చున్నవి. గింజలలోని పప్పు పసిమి వన్నె గల రకముల కంటె తెల్లగ నుండునవి శ్రేష్ఠముగ నెంచబడు చున్నవి. కాని యింకను నీ రకముల పరీక్ష ఆయా పరిస్థితు లందు కర్షకు లేయే రకముల నేయే పరిస్థితులందు విరివిగ సాగుచేయదగి యుండునో నిర్ధారణగ తెలుపదగి నంతవరకు రాలేదు.

---

* ఇట్టి రకపు మొక్కలందొక దానియందు 11 అంగుళముల పొడవు గల యొకే గెలలో 200 గింజల వర కుండెనట.[42]

# సాగునకు దగిన పరిస్థితులు.

ఆముదపు మొక్క ఉష్ణమండలివాసి యగుటచే నిండియాలో దక్షిణ భాగముననే హెచ్చుగ పైరు చేయబడు చున్నది. ఐనను నిది శీతలమును సైతము కొంతి వర కోర్వగలదు. కావున ఉత్తరహిందూస్థానమున చాల భాగమున సముద్రమట్టమునకు సుమారు 5000 అడుగుల యెత్తు వరకును గూడ నీ మొక్క పెరుగుచున్నది. కాని చలి హెచ్చుగా నుండి మంచు గడ్డకట్టుచోట్ల నీ మొక్క లా కాలమున చచ్చును. ఈ పైరు మిక్కిలి తక్కువ తేమతోనే పెరుగగలదు. కాని యువక నంతగా నోర్వదు.

ఉష్ణతను, కొంత శీతలమును గూడ ఓర్వగలుగుటచే నేల యందు పదు ననుకూలముగ నుండుచో నీ సస్యమును విత్తుటకు కాల నియమ మంతగా లేదు. తొలకరిలోను, పయరను, మధ్య కాలమునను గూడ నిది విత్తబడు చున్నది. తొలకరి పంటను వర్షములు ముందుగ ప్రారంభించి తక్కువగ గురియు చోట్లను, తేలిక నేల లందును జూన్-జూలై నెలల లోనే విత్త దగును. వర్షము హెచ్చుగ గురియు చోట్లను, బంక నేల లందును కొంత వెనుకగ జల్లదగును. బంక నేల లందు గూడ వర్షము తక్కువగ గురియు చోట్ల నిది తొలకరిలో (జూన్–జూలై) నే విత్తబడు చున్నది. మధ్య కాలపు సస్యము సెప్టెంబరు-అక్టోబరు నెలలలో సామాన్యముగ నిది జొన్నతో కలిపి గాని, ప్రత్యేకముగగాని విత్తబడు చున్నది. పయర ఆముదము కొన్ని చోట్ల సెనగలతో కలిపి నవంబరులో విత్త బడు చున్నది. డిసెంబరు-జనవరి నెలలలో వరి కోసిన నేలలలో రెండవ

పంటగా పెట్టుట గూడ కొన్ని చోట్ల గలదు. ఇట్లు ప్రత్యేకముగ పై మూడు కాలము లందే గాక మార్చి–ఏప్రిల్ నెలలలో చెరకు తోటల చుట్టును ఆముదములను విత్తుట గలదు. సామాన్యముగ పెద్ద ఆముదము లను, చిట్టాముదములను తొలకరిలోను, వర్షకాలమునను జల్లుటయు, నమపులను వర్షకాలమున గాని, వర్షకాలాంతమున గాని జల్లుటయు వాడుక.

ఆముదము లన్ని విధముల నేల లందును పైరు చేయబడు చున్నవి. ఏటేట వండలిజేరు లంక నేలలలో నీ సస్యము ప్రశస్తముగ నెదుగును. కొండ ప్రక్కల నుండు కొన్ని సారవంతమగు ఎర్ర నేలలలోను, తరుచు యెరువు వేయబడు తోట నేలలలో గూడ నాముదములు బాగుగ ఫలించును. పాటి నేలలు గూడ ఈ సస్యమున కనుకూలములు.

ఆముదములు సామాన్యముగ మెట్ట నేల లందే సాగు చేయబడు చున్నను కొన్ని చోట్ల యిదివరలో సూచింపబడినట్లు వరి నేలలలో గూడ రెండవ పంటగా సాగు చేయబడు చున్నవి.

## సేద్యవిధానము.

ఆముదములను ప్రత్యేకముగ సాగు చేయుట కంటె యితర సస్య ములతో కలిపి సాగు చేయుటయే లాభకరము. దీనితో కలిపి విత్తిసాగు చేయదగిన సస్యములలో నీ క్రిందివి ముఖ్యములు.

జూన్–జూలై నెలలలో:— మెట్టవరి, చోడి, కంది, నూవు, వేరుసెనగ, పసుపు, అల్లము.

ఆగష్టు-సెప్టెంబరు-అక్టోబరు నెలలలో:—చోడి, జొన్న, ఉలవ, పెసర, మినుము.

నవంబరులో:— సెనగ.

ఫెబ్రువరి-మార్చి నెలలలో:—చెరుకు(తోట చుట్టును).

మిశ్రమముగ సాగు చేయుటకు కొమ్మ లంతగా బెట్టని రకము లనుకూలము. అల్లపు తోటలకును, పసుపు తోటలకును ఆముదపు పెంక్కల నీడ మంచిదిగ నెంచబడు చున్నది.

ఆముదములను ప్రత్యేకముగ సాగు చేయుచో తృణధాన్యముల తోను, కాయధాన్యములతోను 3_4 సంవత్సరముల కొకి సారి మార్చి పెట్టవలెను. ఆయా నేలల కనుకూలించు పరివర్తనముల కుదాహరణము లీ క్రింద వ్రాయబడెను.

## ఎర్ర (గరుపకొడి) నేలలకు.

| | |
|---|---|
| 1 వ సం॥ | ఆముదములు (తొలకరిలో) |
| 2 వ సం॥ | గంటె, తరువాత ఉలవ; లేక వేరుసెనగ. |
| 3 వ సం॥ | సూవు + కంది; లేక సూవు, తరువాత ఉలవ. |

## కృష్ణరేవడి నేలలకు.

| | |
|---|---|
| 1 వ సం॥ | ఆముదములు (సెప్టెంబరులో) |
| 2 వ సం॥ | జొన్న + కాయధాన్యములు |
| 3 వ సం॥ | కొర్ర + ప్రత్తి |

తోలకరిలో గాని, వర్ష కాలమున గాని విత్తు సస్యమునకు సామాన్యపు దుక్కి చాలును. వర్షకాలము ముగియుటకు ముందు గాని, ముగిసిన వెనుక గాని విత్తబడు సస్యమునకు దుక్కి లోతుగను, సమగ్రముగను నుండవలెను. లేనిచో మొక్కలు వెనుకగా పదునుచాలక బాగుగ నెదుగవు.

ఆముదపు పంట నేల యొక్క సారమును విస్తారముగ లాగివేయునందురు. ఒక యెకరమున ఫలించు 80 కుంచముల (సుమారు 600 పౌనుల) ఆముదముల ద్వారా నేల నుండి సుమారు $13\frac{1}{2}$ పౌనుల నత్రజని తగ్గిపోవును. ఇతరభాగము లెంత సారమును దీసికొనునో దెలియదు. అవి మరింత నజ్రజనిని తీసికొనుననుకొనుచో నొక యెకరము నుండి సుమారు 27 పౌనుల నత్రజని పోవును. దీనిని భర్తీచేయుటకు సామాన్యముగ నెకరమునకు సుమారు 5-10 బండ్ల పశువుల యెరువును గాని, పెంటను గాని వేయవచ్చును. వీనిని నేలను దున్నుటకు ముందే తోలి పరచవలెను. కొన్ని చోట్ల గొఱ్ఱెలను, మేకలను మందకట్టుట గలదు.

మెట్టనేలలలో ప్రత్యేకముగ జల్లు నెడల విత్తులను నాగటి చాలున వేయవలెను. మిశ్రణముగ సేద్యము జేయు నెడల ప్రధాన సస్యమును వెదజల్లి అముదములను నాగటిచాలున వేయవచ్చును. లేక ప్రధాన సస్యమును గొర్రుతో విత్తి దానివెనుక దీనిని అక్కడిగొట్టముతో విత్తవచ్చును. వరి మళ్లలో పయిరను అనగా డిసెంబరు – జనవరి నెలలలో విత్తునపుడు గోదావరి జిల్లాలో రెండు పద్ధతు లవలంబింపబడు చుండును. బాగుగ దున్నిన నేల యందు గసికతో కన్నములు పొడిచి రెండేసి గింజలను వేసి కొంచెము నీరు పోసి మంటిని ద్రోసి కప్పుట యొకటి. ఇట్లు

నాటు సస్యమునకు 'ఒడిఆముదము' అని పేరు. నేలయందు పదును తక్కువగ నున్నచో గింజలను వేడి నీటిలో బోసి 24 గంటల కాలము నాననిచ్చి విత్తుట గలదు. మళ్ల గట్లమీద గాని, యితర సస్యముల చుట్టును గాని విత్తునపుడు గూడ నిట్లే గసికతో పొడిచి వేయవలసి యుండును. రెండవ పద్ధతిలో బాగుగ దున్నిన నేలపై ముందొక పెద్ద నాగటిని దోలుచు నా చాలులోనే మరి యొక చిన్న నాగటిని లోతుగ బోనిచ్చి యీ నాగటి కొక అక్కడి గొట్టమును గట్టి దానిగుండ విత్తులను వేయుదురు. మరియొక నాగటి చాలుచే నీ విత్తులు కప్పబడును.

ప్రత్యేకముగ విత్తు నెడల పెద్దాముదములను, చిట్టాముదములను సుమారు 4-4½ అడుగుల దూరము గల వరుసలలో విత్తి, వరుసలో 2 అడుగుల కొక మొక్క నుంచుట మంచిది. సెప్టెంబరు-అక్టోబరు నెలలలో విత్తబడు నపుడు 2-3 అడుగుల దూరము గల వరుసలలో 1½ అడుగు దూరమున నొక్కొక మొక్క నుంచవలెను. నవంబరు, డిసెంబరు, జనవరి నెలలలో జల్లునెడల 1½-2 అడుగుల దూరము గల వరుసలలో మొక్కలు 1-1½ అడుగు దూరమున నుండవచ్చును. ఆలస్యముగ విత్తిన కొలదిని మొక్క కురుచగ నెదుగుటచే విత్తు కాలమును బట్టి మొక్కల దూరమును తగ్గించవలసి యుండును. సామాన్యముగ మొక్క లుండవలసిన దూరము కంటె గింజలను వరుసలలో రెట్టింపు ఒత్తుగ వేసి మొలచిన వెనుక పలుచన చేయుట మంచిది.

ఒక యెకరము జల్లుటకుపట్టు విత్తుల పరిమాణము రకమునుబట్టియు, వానిని వేయు దూరమును బట్టియు నుండును. 4 అడుగుల దూరమున

అడుగున కొకగింజ వేయుచో పెద్దాముదము ఎకరమునకు సుమారు కుంచెడు (నాలుగు సేర్లు)* గింజలు చాలును. 3 అడుగుల దూరమున జానెడేసి దూరమున వేయుచో నడుపులును సుమారు అంతే పట్టును. చిట్టాముదములకుచో సుమారు మూడు సేర్లు చాలును. 1½ అడుగు దూరము గల వరుసలలో జానెడేసి దూరమున వేయుచో నడుపులు సుమారు 8 సేర్లు పట్టును. మిగుల నీరసపు నేలలో నెకరమునకు సుమారు 12 సేర్ల వరకు విత్తుట గలదు.

మిశ్రిణముగ జల్లు నేలల ప్రధానసస్యమును వెదజల్లి ఆముదము లను వరుసలుగ వేయవచ్చును. లేక రెంటిని వరుసలుగ వేయవచ్చును. ఆముదపు వరుసలు విత్తు కాలమును బట్టి సుమారు 3-6 అడుగుల దూర మున కొకటి యుండదగును.

ఆముదపు గింజలు నూవు, వేరుసెనగ మొదలగు వానిలో కంటె యాలస్యముగ మొలచును. సామాన్యముగ 5-7 దినములలో మొక్కలు బాగుగ పైకి వచ్చును.

తొలకరిలో జల్లిన యాముదపుచేలలో వర్షములు అధికముగకురియు చున్న యెడల మొక్కల మధ్య కలుపు మాత్రము తీయవలెను. వర్షము లంతగా కురియనిచోట్లను, ఇతర చోట్ల వర్షము తెగబెట్టినపుడును, నేల తగినంత మెరకగనున్నపుడును, వరుసలమధ్య యవసరమునుబట్టి గుంటకతో

* ఒక కుంచెడు ఆముదపుగింజలు సుమారు 7½-7¾ వీ. తూగును.

